Regd No. M. 3289

గోలకొండ పత్రిక

| | |
|---|---|
| సంవత్సరమునకు | ౬-౦-౦ |
| ఆరుమాసములకు | ౩-౦-౦ |
| విడిపత్రిక | ౦-౧-౦ |

విదేశములకు

సంవత్సరమునకు ౧౪ షిల్లింగులు
ఆరుమాసములకు ౮ ,,

మరా:— ఆరుమాసముల తక్కువ కాలపు చందాకు పత్రిక పంపబడదు.

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు వెలువడు జాతీయపత్రిక

సంపుటము ౧౨ | హైద్రాబాదు-దక్కన్ ౧౫ అబాన్ ౧౩౪౬ ఫ. శా.శ. ౧౮౫౯ ఈశ్వరనామ సంవత్సర భాద్రపద శు. ౧౫ సోమవారము | సంచిక ౩౫



## హైదరాబాదు శాసనసభా విస్తరణ సంఘము

ఒక ఆంధ్రుడు.

తమ గోలకొండ పత్రికలో "ఆంధ్రుల అవమానము," అను శీర్షకక్రింద తమ ప్రత్యేక విలేఖరి వ్రాసిన విషయము చూచితిని. అందు అరావముదు అయ్యంగారును గూర్చి వారికి ఆంధ్రులపక్షమున మాట్లాడుట కెట్టి హక్కు గలదని ప్రశ్నించినారు. తమవిలేఖరికి "అయ్యంగారిని ఆంధ్రుల ప్రతినిధిగా నియమించిరని" తెలుపుటకు యెట్టి తావును లేదు ప్రభుత్వము వారు తద్విషయమై ప్రమాణముగ ప్రకటనను వెలువడ జేయుటలేదు, సభ్యులు ప్రభుత్వమువారిచే జాతిప్రాతినిధ్య దృష్టితో నియమింపబడిరని తెలుపుట కవకాశము లేదు ఒకవేళ ప్రభుత్వమునకట్టి దృష్టియున్నను కేవలము హిందువులు, మహమ్మదీయులు, అను స్థూలదృష్టితో యిరు మతముల ప్రతినిధులును నియమింపబడి యుండును. అదియునుగాక కాశీనాథరావువైద్య గారిని నియమించుటకు వారు యిటీవల తెచ్చిన "శాసన సభా విస్తరణపు బిల్లు" కారణము కాకూడదా? అట్లే అలీఖానుగారిని నియమించుటకు వారిమధ్య హైదరాబాదు రౌండుటేబిల్ సమావేశము విషయమై సల్పిన కృషి కారణము కాకూడదా? తీరితే అరావముదు అయ్యంగారును అధ్యక్షపదవిచే గౌరవించుటకు వారిదినములో అనేక నిరోజకవర్గములలో సభ్యులుగా నుండుటయు, లాయందు అసమానము ప్రావీణ్యము కలిగియుండుటయు, (హిందూ నాయకులలో నొకరగుటయు కూడ) కారణము లై యుండకూడదా?

ఒకవేళ తమ విలేఖరి తలచినట్లయినను వైద్యగారు మహారాష్ట్రేతర హిందువులపట్ల చేసిన ప్రియహితములు శ్రీ అయ్యంగారు ఆంధ్రులకు చేయలేదా? ఈ దినము వఱకును నిజాం రాష్ట్రములోని సంస్థానములలో నగ్రస్థానము వహించునట్టిన్ని, దానధర్మాదులకు నిజాం రాష్ట్రేతరాంధ్రులలోకూడ ప్రసిద్ధి పొందియున్నట్టిని గద్వాలు సంస్థాన మిప్పటిస్థితిలో నిలబడియుండుటకును, అభివృద్ధిలో యుండుటకును అరావముదు అయ్యంగారే కారకులు అనే సంగతి ఆంధ్రులు ఇంతత్వరలోనే మఱచిపోయి యుందురని తలంతును. శేషించిన ఆంధ్రుల మాట యెట్లున్నను గద్వాలు ఆంధ్రుల తరఫునుంచి వారి మంచిచెడుగులను గూర్చి ప్రాతినిధ్యతను వహించి మాట్లాడుటకు వైద్యగారు ఇతర హిందువులగూర్చి మాట్లాడుటకు గల్గినంత హక్కైనను లేదా? (గద్వాలు ఆంధ్రుల సంఖ్యయు తక్కువగాదు.)

ఇటీవల తమపత్రికలలో ఆంధ్రులు న్యాయమూర్తి రామచంద్ర నాయక్ గారిని అభినందించుచు వారు చాలకాలము ఆంధ్రులమధ్య నుండుటనుబట్టి వారు ఆంధ్రులేయనియు వారిని జడ్జీగా నియమించుట ఆంధ్రులను సన్మానించుటేయనియు అన్నట్లు పత్రికాముఖమున చూచినట్లు జ్ఞాపకము. ఇప్పటికి సుమారు ౫౦ సం॥ రములనుండి ఆంధ్రులమధ్య పెరిగి జీవితములో మూడువంతులు పైగా యిచ్చటనే యుండి ఆంధ్రసంస్థానముల తరఫున పనిచేసిన అయ్యంగారు అవాంగ్రపు ఆంధ్రుడు కాజాలడా? ఆంధ్రదేశమున ఎంతమంది అ ఆంధ్రేతరులు (భాషాభేదమును బట్టి) ఆంధ్ర ప్రతినిధులు గాలేదు? చిత్తూరునందలి పార్థసారథి దొరస్వామి అయ్యంగార్లు ఇందుకుదాహరణ?

(ఈసందర్భమున నీమ్య నాయక్ గారు "నేను ఆంధ్రుడను కాను, మహారాష్ట్రుడను కాను, హైదరాబాదు నివాసిని" అని చెప్పిన వాక్యమును స్మరింపుకోవలెను.)

ఆంధ్రులనుంచి కూడ యీపదవికి యోగ్యులగువారిని [illegible] నియమించుట ప్రభుత్వము వారికికూడ సమంజసమైయున్నది అట్లొకవేళ్ల వారు నియమింకపోయినను శ్రీ అయ్యంగారు తమ అధ్యక్షాధికారమున, తాము చిన్నప్పటి నుండియు ఆంధ్రులమధ్య పెరుగుటచే వారి బాగోగులు తమవే యనియెంచి, ఆంధ్ర వాయు

## అరవముద అయ్యంగారి ఆంధ్ర సానుభూతి

మాడపాటి—హనుమంతరావు

గోలకొండ పత్రిక (౧౩-౮-౩౭) యొక్క నవపుటలో "ఆంధ్రుల అవమానము" అను శీర్షికతో ప్రకటింపబడిన వ్యాసమును చూచుట సంభవించినది

దీనిలో దివాను బహదురు అరవముదు అయ్యంగారు బి.ఏ.బి.ఎల్, ఎం.బి.ఇ గారు, శాసన సభా సంస్కరణముల కమిటీలో ఆంధ్రులపక్షమున నిర్ణయింపబడినట్లు ఊహించి విమర్శనము వ్రాయబడినది. ఈ విషయమున ప్రభుత్వప్రకటన వెలువడలేదు. "హైదరాబాదు బులెటిను"పత్రికలో ప్రకటితమైన వార్తను బట్టిచూచినను, వారు కమిటీకి అధ్యక్షులుగ నుందురనియే తెలియుచున్నది కాని వారు ఆంధ్రులపక్షమునగాని ఆంధ్రుల ప్రతినిధిగా గాని నియోగింపబడినట్లులేదు ఇట్టి సందర్భమున కేవలము ఊహలపై నాధారపడి విమర్శనావృష్టి గురిపించుట న్యాయముగా దోచుటలేదు.

శ్రీ దివానుబహదరుగారు తాము ఆంధ్రులమనిగాని, ఆంధ్రులపక్షమున మాట్లాడు హక్కు కలుగుటదనిగాని ఎప్పుడును వచించియుండలేదు వారు మనరాష్ట్రములోని హిందూమహాశయులలో గొప్పవారు అనుభవశాలులగు న్యాయవాదులు. ఉభయ ప్రభుత్వములవారి వలనను మెప్పువడసినవారు పండితులు న్యాయశాస్త్రవేత్తలు.

ఆంధ్రులు కాకపోయినను, మన రాష్ట్రములోని ఆంధ్రులయెడను ఆంధ్రసంస్థలయెడను సానుభూతి, అభిమానము కలవారు. ఖమ్మములో జరిగిన తృతీయాంధ్ర మహాసభకు ఉత్సాహప్రదమగు సందేశము పంపియుండిరి. శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషా నిలయమునకును, బాలికల ఉన్నతపాఠశాలకును ధనసహాయ మొనర్చియుండిరి. ఇట్లే మహారాష్ట్ర కర్ణాటకసంస్థలపైనను వీరికి అదర అభిమానములు కలవు. మొత్తముమీద రాష్ట్రములోని హిందువులందరికిని వీరు ఇష్టులని చెప్పుట కద్యంతరము లేదు! వీరియధ్యక్షత యోగ్యముగా నేయున్నది

కాని, కమిటీలో, శ్రీయుత వైద్యాగారు గాక ఆంధ్రులొకరును, కర్ణాటకులొకరును సభాసదులుగా నుండుట చాల అవసరమని నాతలంపు ఈ రాష్ట్రములోని మూడు భాషా ప్రాంతములలోను మంచిప్రబోధ మేర్పడినది ప్రతిప్రాంతమువారును తమతమ ప్రాముఖ్యమును స్పష్టముగా గుర్తించియున్నారు కనుక పైనచేయబడినసూచన ప్రభుత్వమువారు దృష్టియందుంచదగినదని నావిశ్వాసము పైమూడు ప్రాంతములవారి సంతుష్టియొక్క ప్రాముఖ్యమును ప్రభుత్వమువారును, వారి కాలోచన చెప్పువారును మరువగూడదు.

౧౫ అబాన్ ౧౩౪౬ ఫసలీనాడు కమిటీ సభ్యుల పేర్లు ప్రకటింపబడునట. ఈలోపల, కేవలము పత్రికలలోవచ్చు వార్తలపైన నాధారపడి తీవ్ర విమర్శనము చేయుట మనస్తాపముల కారణమగు నేమోయనియనిపించుచున్నది. అట్లుకాకుండు గాక!

కుంతో సంప్రదించి ఆంధ్రుల భయమువ క్షేమాభ్యుదయములు కాపునేయనని తలంతును హైదరాబాదు ఆంధ్రులును తమప్రతినిధి నేలుగా లేకుండదాయని కినియక శ్రీఅయ్యంగారికి తమ వాంఛితాభిప్రాయములను తెలియజేయుచు శాసనసభా విస్తరణోద్యమమున వారికి తోడ్పడుదురుగాక యని ప్రార్థన

## ఆంధ్ర గజానన సంఘము మలకపేట

(మా ప్రత్యేకవిలేఖరి)

మలకపేటలో ఒకసంఘము అజంపూరా (మలకపేట)లో స్థాపింపబడి మూడుసంవత్సరము లనుండి ఉత్సాహకరమైన కార్యక్రమము నడిపించుచున్నది.

ఈసంవత్సరము గణేశచవితి బుధవారంనాడు స్థాపన, పూజానంతరం మధ్యాహ్నం నగరమునందలి ఉత్సాహపూరిత యువకులలో ఒకరయిన విద్వాన్ మంథా సుబ్రహ్మణ్యశాస్త్రి గారిచే మంతలోపాఖ్యానం పురాణరూపకంగా చెప్పబడెను సాయంకాలం ఆంధ్రదేశము నుంచివచ్చిన వేంకటనారాయణగారిచేత గానసభ జరుపబడినది పాటలు వయసులో చిన్నవారేఅయినప్పటికి రాగాలాపన బాగానున్నది. వీరు చాలావరకు దక్షిణదేశ సుప్రసిద్ధ గాయకులైన ముసూరి సుబ్రహ్మణ్యఅయ్యరును అనుకరించుతూ పాడారు

రాత్రికి అటుపైపునుంచేవచ్చిన శ్రీ దీక్షిత దాసు భాగవతార్ గారిచేత స్వరచిత శ్రీ కృష్ణ రాయబారం, హరికథగా చెప్పబడినది. వీరు యువకులే యైనా కవిత్వం, గంభీరంగానూ, గాత్రం మధురంగానూఉన్నది కాని వీరికథలో రెండు మూడు అసందర్భములు కనిపించినవి. ఏమనగా దుర్యోధనుడు ఒక అందమైనకన్నను పెంచి ఎప్పుడూ వెంటనుంచుకొనేవాడట ప్రాచీనాచారానికి ఇది ప్రతికూలం అనుకుంటూను తరువాత పాండవులను గొల్లంఉన్నవని ఎవరుచెప్పినా దుర్యోధనుడు వనవాసానికి వెళ్ళాడట ఆ సభలోఉన్న జమదగ్ని మహామునిగూడలేచి చెప్పాడట కార్తవీర్యార్జునిచేత చంపబడ్డ జమదగ్ని మళ్లీ జీవించినట్లుగా ఏపురాణంలోనూలేదు. అదేసమయంలో నారద మహామునిగూడవచ్చి ఏలాగైనా సంధి చేసుకోమంటాడట ఇది ఆతని ప్రకృతికివిరుద్ధం అనుకుంటూను పైగా సభ్యులెవ్వరూ ఈ అసభ్యతను గుర్తించినట్లుగూడా లేదు. వీరికి "హరికథా సుధాకర"అని ఒక బిరుదుగూడా ఉన్నదికాని దానిఅర్థం విస్పష్టంగా లేదు. శ్రీ దీక్షితులుగారు ముందయినా ఈలోపాలనుదిద్దుకుంటే చాలఅభివృద్ధిలోకి వస్తారు

గురువారంనాడు పూజానంతరం మధ్యాహ్నం స్త్రీలు సమావేశమై శ్రీమతి సీతాకుమారిగారి యాజమాన్యమున భజనపాటలు మొదలయినపాటలతో కాలక్షేపము చేసిరి

రాత్రికి దీక్షితులవారి శిష్యులలో ఒకరిచేత వారిచేతనే రచింపబడ్డ "కీచకవధ" హరికథగా చెప్పబడ్డది. శిష్యులతనంచేత ప్రత్యేకంగా విమర్శింపనక్కరలేదు.

శుక్రవారంనాడు మధ్యాహ్నం మూడుగంటలనుంచి అదే పెండాలులో ఆంధ్రయువతీ మండలియాజమాన్యమున స్త్రీలకూపురుషులకూ సభజరుపబడ్డది విఖ్యాత స్థానిక నాయకులలో ఒకరయిన శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారు అధ్యక్షతవహించారు బాలికలప్రార్థనతో కార్యక్రమం ఆరంభమయింది అధ్యక్షులవారు ప్రసంగిస్తూ, గణపతి పుట్టుపూర్వోత్తరాలన్నీ వివరించారు ఇతనినికొందరు పంటలకు సంబంధించిన దేవుడని వ్రాశారుకాని తమకుమాత్రం విద్యలకు సంబంధించినదేవుడులాగా కనిపిస్తాడనీ బహుపురాతన కాలంనుంచీ ఈగణపతి ఆరాధన మనలోఉన్నదనీ అనేక నూతన విషయాలను వివరిస్తూ ఉపన్యసించారు తరువాత నైజాం పదర్ దవాఖాన స్థాపకుల్లో ఒకరయిన శ్రీమాన్ ఆయుర్వేదాచార్య తిరుమల రామానుజస్వామిగారు ఉపన్యసిస్తూ సాధారణంగా హిందువుల పండుగలన్నీ ఆరోగ్యశాస్త్రానికి ముడిపెట్టబడేఉంటాయనీ ఈగణపతి ఆరోగ్యానికి సంబంధించిన దేవుడనీ అనేక వైద్యవిషయాలతో ఉపన్యసించారు తరువాత "అభినవ విశారద" గారు గారికాదేవి గారు మీరాబాయి భక్తిసాధనలో పదములు గారి ప్రవాసనమూ రాగభ క్తిస్వాదములు కేవ్యశ్యములను ప్రదర్శించారు. ఈ ప్రదర్శనములు, వేషాలంకారాలు, వాయిద్యాలూ, దీపాలూ, ఏమీ లేకపోయినప్పటికీ అభినయంలో ఆమెకు ఉన్న అసాధారణ సామర్థ్యంవల్ల హృద్యంగానే [illegible] అధ్యక్షు

## పౌరసత్వములు ప్రసాదింపవలయును

హైద్రాబాద ప్రజాపక్ష రాజకీయ మహాసభ స్థాయీసంఘమువారి తీర్మానము

హైద్రాబాద ౧౩ అబాన్

౧౨ అబాన్ రోజు జరిగిన పైసంఘ సమావేశమునందుక్రింది తీర్మాన మేకగ్రీవముగా అంగీకరింపబడి ప్రభుత్వ సభాధ్యక్షులకు పంపుటకు కార్యదర్శిగారి కనుమతివ్వబడినది.

"ప్రభుత్వమువారు రాష్ట్రమునందు నూతన సంస్కరణములు ప్రకటింప నున్నారు హైద్రాబాద ప్రజాపక్ష రాజకీయ మహాసభ స్థాయీసంఘమువారు ప్రజల ప్రాథమిక సత్వముల ప్రకటనవిషయమై ప్రభుత్వమువారికి దెలిపిన వానిపై తమ దృష్టి నాకర్షింపజేయుట కీ సభవారు కోరుతున్నారు. నూతన సంస్కరణముల ప్రకటనతో పత్రికా, రచన, సభా స్వాతంత్ర్యములు ప్రకటించుటత్యవసరమని భావించు చున్నారు. కాబోవు సంస్కరణముల యుద్దేశము రాష్ట్రమునందు బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపనగా నుండవలయునని సభవారు కోరుచున్నారు ఏపద్ధతియైనను దాని విషయమై ప్రజాభిప్రాయము గమనించుటకు వివరపడవలయును. ప్రజాభిప్రాయసమ్మతిపై చివరనిర్ణయము జరుగునటుల యుండవలయు"నని యీసభవారు తీర్మానించుచున్నారు

స్వ. వి

లు ముగిస్తూ సభలో కోలాహలం ఎక్కువగా ఉన్నదని సూచించారు శ్రీ శారదాదేవిగారి అభినయమును ప్రశంసించి మండలిపక్షమున ఒక పతకమును ప్రసాదించిరి సీతాకుమారిగారి కృతజ్ఞతలతో సభ చాలింపబడ్డది

తరువాత ౬ గంటలనుంచీ శ్రీ ప్రొఫెసరు కురుగంటి సీతారామయ్యగారి ఉపన్యాసము జరిగింది వారు శేషమూ గణపతివిఘ్నములకు సంబంధించిన దేవుడనీ, అనగా విఘ్నములను ఎదిరించడానికి ఏనుగలాటిబలమూ, చెమ్మదీ, ఎలుకవంటి చురుకుతనమూ కొంద లైనవి కావలెనని వివరించుతూ ఉపన్యసించారు. రాత్రికి ద్రౌపదీ మానసంరక్షణ హరికథ జరిగింది.

శనివారంనాడు పూజానంతరం మధ్యాహ్నం మళ్లీ స్త్రీలు సమావేశమై బాలికల గానముతో కాలక్షేపము చేసిరి సాయంకాలం ౬ గంటలకు "మాతృభారతి" సంపాదకులయిన శ్రీ బిరుదు వేంకటశేషయ్యగారిచేత భారతీయ నాగరికతనుగురించి ఉపన్యాసం జరిగింది వారు ప్రపంచ నాగరికతకు భారతీయ నాగరకతే ప్రథమంటనీ, ఇప్పుడు పాశ్చాత్యులు కనుక్కోలేని అనేకవిషయాలను మనబుద్ధులు ముందేకనుక్కున్నారనీ.ఇవన్నీ ఇప్పుడు మూఢనమ్మకాలక్రింద తోసివేస్తున్నామనీ వివరంగా ఉపన్యసించారు కాని కంఠంచాలా చిన్నగా ఉండడంచేత శుద్ధ గ్రాంథికంలో మాట్లాడడంచేత కొన్నిసంగతులు విస్పష్టంగా తెలియలేదు.

రాత్రికి ౯॥నుంచి కొంతమంది విద్యార్థులచేత కొన్నిరంగాలు—సారంగధరలోని చిత్రాంగి [illegible] కటెంటిదృశ్యం, కన్యాశుల్కంలోని మధురవాణి పడకటింటిదృశ్యం, మరోకమటివాని ప్రహసనమూ, ప్రదర్శింపబడ్డవి ఈ అయిదురోజుల కార్యక్రమంలోనూ, అపూటమాత్రమే, ఆపెండాలంతా కిటకిటలాడుతూ, స్త్రీలూ పురుషులూ ముసలమ్మలూ, పసిపిల్లలతో నిండిపోయింది నాటకమొదలు పెట్టుతామన్న వేళకు ౧॥గంట ఆలస్యంగా కార్యక్రమం ఆరంభమయింది. అందులో చిత్రాంగివేషధారుడు కన్యాశుల్కంలో గిరీశం, మధురవాణీ పాత్రధారులూ చాలా నేర్పుతో ప్రదర్శించారు. కాని సారంగధరుడూ, రామప్పంతులూ కోమటివేషధారి విద్యార్థి ఒక్కడూ

## శిరికొండ

(ఒక విలేఖరి)

౮ అబాన్

ఈగ్రామము జగిత్యాల తాలూకాలో చేరినది ఇంతవరకు పైరులకు తగినవర్షము కురియుటచే పైరులకెట్టి రోగ వ్యాధి బాధలులేక చక్కగాగలవు

ఈగ్రామము జనసంఖ్యనుబట్టి వ్యవహారమునుబట్టి చుట్టుపట్టుగ్రామాదులలో పెద్దదిగా గలదు ప్రజలసౌకర్యార్థమై యిక్కడ టపాఖాన ఒక ప్రాథమిక పాఠశాల కలదు. కాని ఇంగ్లీషు విద్యాభ్యాసమునకు తగిన ఏర్పాటులు లేవు ఒక బాలికల పాఠశాలకూడ కలదు కాని ఇదిప్రత్యేకముగా మహమ్మదీయ బాలికలకే గలదు. హిందువుల జనసంఖ్య మహమ్మదీయులకన్న యెన్నియో రెట్లు హెచ్చు. కాని హిందూ సోదరీమణులకు విద్యాభ్యాసమునకై వీలాటి ఏర్పాటులులేవు ఇది హిందూబాలికల పూర్వజన్మ పాప ఫలము కాబోలు! ఇచ్చట ప్రబలుచున్న వ్యాధులనుబట్టి ఒక యునానిలేక ఆయుర్వేద ఔషధాలయము చాల ఆత్యవసరము

గూడ ఒక్కభావాన్నయినా సరిగా చూపలేకపోయినాడు పైగా అంతా మరిచిపోయినాడు కూడాను.

రాత్రి పదిగంటలనుంచి శ్రీ చంద్రశేఖరరావుగారి హరికథ, "సతీతులసి"జరిగింది.

ఆదివారంనాడు ఉదయం తొమ్మిదిగంటలనుంచి శ్రీకిరా అగ్గన్నశాస్త్రిగారిచేత భక్తిని గురించి ఉపన్యాసంజరిగింది శ్రీశాస్త్రిగారు వయోవృద్ధులూ, చాలాపండితులూ, మంచివక్తలూగూడ అయిఉన్నారు వారు బ్రహ్మజ్ఞానమును గురించి సుబోధకంగానూ, గంభీరంగానూ రెండుగంటలకాలం ఉపన్యసించారు

మధ్యాహ్నం సుమారు ఏడెనిమిది వందలమంది బీదవారికి అన్నదానం చెయ్యబడ్డది.

ఇలాటి ఉత్సాహకరమైన, దీర్ఘతరమైన కార్యక్రమం జరుపవలసివచ్చుడు సహజంగా కొన్నిలోపాలుజరుగుతాయి ముందు సంవత్సరానికైనా సవరింపబడుతాయనే ఉద్దేశ్యంతో కొన్ని సూచిస్తున్నాను కార్యక్రమం చాలారోజులు ముందుగానే పంచిపెట్టవలసి కాని తరువాత కార్యక్రమం చాలామారిపోయింది. అందువల్ల దగ్గిరవారికితప్ప ఇతరులకు చాలాఇబ్బంది కలిగింది. ఉపన్యాససభలు జరిగేటప్పుడు సభ్యులు చాలా తక్కువగా ఉండేవారు మొత్తంలో ఏఒక్క సభకుకూడ ఇరువయిమందికంటే ఎక్కువమందిలేరు. పైగా ఉపన్యాసకులను త్వరగా ముగించుమని త్వరపెట్టడము. ఆదే హరికథలప్పుడూ, ప్రదర్శనాలప్పుడూ అయితే పందిళ్లన్నీ నిండకమూ, ఎంతఆలస్యమయినా కూచోడమూ జరిగేవి. తరువాత ప్రతికార్యక్రమమూ అరగంట, గంట ఆలస్యంగా మొదలుపెట్టడము, వాలంటీర్లు లేకపోవడంవల్ల సభలో అల్లరి అధికంగాఉండడమూ జరిగేవి. ఈఅన్నికారణాలవల్ల మలకపేటఆంధ్రులు సభ్యతలో చాలా వెనుకబడినట్లు అనుకోవలసి వస్తున్నది. ఇక అప్రదర్శనముల విషయము గజానన ఉత్సవములలో, అలాటి వికటశృంగార దృశ్యములకంటే, భక్తి, సంస్కరణ, ప్రధానమయినవి ఎక్కువ బాగుంటాయనుకుంటాను ముందు అభివృద్ధిలోకి రావలసిన విద్యార్థులు ఇలాటి ప్రదర్శనాలు మానితే బాగుంటుంది ఇక వారి కథల్లోగూడా కీచకవధా, సతీతులసీ మానివేస్తే బాగుండేది పురాణ కథలైనంతమాత్రాన వీటికి పూజ్యతలేదనుకుంటాను.

పైగా ఇంతడబ్బుఖర్చుచేసి ఈ హరిదాసులను పిలిపించి అనేకసార్లువిన్న పురాణకథలనే వినేకంటే ఆడబ్బుతో ఎవరయినా పండితులనూ, కవులనూ పిలిపిస్తే వారిసందేశములను విననచ్చునుగదా ఈ సంవత్సరపు కార్యనివేదిక ఇంకా వెలువడలేదుకాని ఖర్చు సుమారు రెండునూర్లు ఏభైవరకూ ఉండవచ్చును

సాయంకాలం ౭ గంటలకు ఊరేగింపుతో గణపతి ఉద్వాసన జరిగింది.

## పురపాలక సంఘపు ఎన్నికల ఫలితములు

౧. అవ్వల్ అందరూన్
స మహమ్మదలి మూసవీ ౬౩౬ ఓట్లు *
మ హిసాముద్దీన్ ఫాజల్ ౫౬౯ ,,

౨. దువ్వం అందరూన్
మీర్ అహమదలీఖాన్ ౪౦౪ ,, *
గణపతిరావుగారు ౩౯౯ ,,

౩. సువ్వం అందరూన్
స. మ. అహసన్ ౪౮౦ ,, *
స. మొహియొద్దీన్ ౨౪౪ ,,

౪. చహారుం అందరూన్
మహమ్మదు హిలాలీ (పోటీలేదు) *

౫. అవ్వల్ బేరూన్
గులాం మహమ్మదుఖాన్ ౯౩౧ ,, *
యన్ లక్ష్మణరావుగారు ౧౩౩ ,,

౬. దువ్వం బేరూన్
గుండేరావు హర్కారేగారు ౨౩౧ ,, *
యం, లక్ష్మీనరసయ్యగారు ౧౭౩ ,,

౭. సువ్వంబేరూన్
ప్రేంజీ లాల్జీగారు ౧౩౬౨ ,, *
బి. రాంకిషన్‌రావుగారు ౮౧ ,,

౮. హాఖ్లే అలీఫ్
మా. గులాంముస్తఫా ౯౫౧ ,, *
కేశవరావుగారు ౩౯౧ ,,

౯. హాఖ్లే బె
శ్రీధర వామన్ నాయకుగారు (పోటీలేదు) *

౧౦, హాఖ్లే జీం
హకీం నారాయణదాసుగారు ౯౦౦ ,, *
ముకుందదాసుగారు ౪౦౭ ,,

౧౧. హాఖ్లే దాల్
కృష్ణస్వామి ముదిరాజ్‌గారు ౫౬౨ ,, *
మ. జమాల్ఖాన్ ౩౬౯ ,,

౧౨. హాఖ్లే హె
మ రఫీయొద్దీన్ ౪౧౩ ,, *
శ్రీపతిరావు ౨౯౬ ,,

౧౩, హాఖ్లే వావ్
మహమ్మదు అమరుల్లా ౨౫౪ ,, *
అబ్దుల్ రహిమాన్ ౧౬౮ ,

* మార్కుగలవారు యెన్నికలలో జయమొందిరి.

## సదరుల్మహాం సర్ఫఖాను

సర్ఫఖాన్ సదరుల్మహాంలగు నవాబు బారాజంగు బహద్దురుగారి యుద్యోగకాలము ప్రభువుగారు ౧౩౪౭ ఫసలీ అంతమువరకు— ఒక సంవత్సరము— హెచ్చించిరి

## విశ్వ విద్యా పీఠము

ఉస్మానియా విశ్వవిద్యాపీఠమువారి యాజమాన్యమున పురోద్యానభవనమునందు (టౌన్ హాల్) (అండిర్) మ్యాన్ కౌన్సిల్ ప్రత్యేక విలేఖరియగు ఫర్నాండుగారు నేడు సాయంకాలము ౬-౪౫ గంటలకు "చీనా జపాను యుద్ధము ప్రపంచశాంతి" విషయముపై నుపన్యసించెదరు.

## బ్రాడ్కాస్టింగు స్టేషన్

సరూరునగరమునందు క్రొత్తగా నిర్మింపబడుచున్న బ్రాడ్కాస్టింగుస్టేషనును, పూర్వపు స్టేషను సయ్యదుమహబూబలీ, నవాబ యార్ జంగు బహద్దురుగారితోపాటు నవాబు బహాదురుగారు పరీక్షించిరి.

# గోలకొండపత్రిక

ఈశ్వరనామ సం॥ర భాద్రపద శు॥౧౫

సోమవారము


## పరిపాలనా సంస్కరణములు

రాజుచే పరిపాలింపబడు భూభాగము సర్వసామాన్యముగా రాజ్యమను నామముతో వ్యవహరిత మగుచున్నది. కాని రాజనీతి శాస్త్రమునం దీరాజ్య శబ్దమునకు అతిగూఢార్థము గలదు. రాజ్యశబ్దము సార్థక మగుటకు (౧) ప్రజ (౨) భూభాగము (3) ప్రభుత్వము—(ప్రజల సమకూర్పు నాస్థ(౪) అంతర్విషయాధి పత్యముతో బహిర్విష యస్వాతంత్రమను నాలుగంగములు స్థిరపడియుండుట త్యవసరము.

ఇతర సాంఘిక శాస్త్రములవలె రాజనీతి శాస్త్రమునకు సంఘముతో స్థిరసంబంధముగలదు.సంఘమందలివివిధ వ్యక్తులు వివిధావసరముల ననుసరించి వివిధ సంబంధబాంధవ్యములు కలిగించు కొనుచుండుట లోకవిదితము. ఇట్టిబాంధవ్యపు ప్రత్యేక దశయే రాజ్య మను టనిశ్చయము. వివిధమగు సాంఘిక సంబంధములలో రాజకీయ సంబంధమునకుగల ప్రత్యేకతను రాజ్య మనవచ్చును. ఇట్టి నిర్వచనముతో పరిశీలించిన ఆస్ట్రేలియా యందలి విక్టోరియా, అమెరికా యందలి మిసిచిగన్ లేదా భారతీయ స్వదేశ సంస్థానములకు శిరోమణిగా నెన్నబడదగు హైద్రాబాద రాజ్యములన దగినవా కావా యను విషయము వేరు. అది ప్రస్తుతము చర్చనీయాంశము కాజాలదు.

ప్రజల అవసరములతీర్చి, వారి యభ్యుదయమునకు పూచీవహించి, వారి అభివృద్ధికి వలయు సమయానుకూల సౌకర్యములు కలిగించుటకు సంకల్పించు— వాక్కు రూపమున కాదు క్రియా రూపమున— ప్రజాహిత రాజ్యములను ప్రజలు "రామరాజ్యము" గా వ్యవహరించు చుందురు. నిరంకుశ ప్రవర్తనగల లేక అట్టి ఆచరణకు అలవాటు కలిగింపబడిన యే కొందరో తప్పమిగిత రాజులు అందరు స్వార్థమూర్తులుగా నుండక ప్రజాక్షేమమునకు పాటుబడు చుండుట నేటికిని గాన నగును.

రాజ్యము యొక్క నిలకడకు ప్రజాహిత ప్రభుత్వ స్థాపన మత్యవసరము. అనగా ప్రభుత్వము రాజ్యముయొక్క నిర్మాణము. రాజ్యపు భావ ప్రకటనకు ప్రభుత్వములు సాధనము,కాబట్టి రాజ్యము ఆజ్ఞల ప్రసాదించుటకు, వాని పోషణ నిర్వహణమునకు శక్తివంతమగు ప్రభుత్వము, అదేపద్ధతి ననుసరించిన దైననుసరే, యేర్పడి కాదు యేర్పరచి యుంచుట ముఖ్యము.

ప్రభుత్వమునకు ప్రజామోదమే అమోఘమగు శక్తిని ప్రసాదించుచుండును. వ్యక్తిగత ప్రభుత్వములు నిరంకుశాధి పత్యములు ప్రజామోదమను పునాదులు లోపించుటచే కాలగర్భమున నామరూపములు లేక, లీనమగుచున్నటుల చరిత్రలే ఘోషిల్లుచున్నవి.

రాష్ట్రాభ్యుదయమునకు రేయింబవలు కృషి సలుపుచున్న నిజాంప్రభుత్వము పరిపాలనము నందు ప్రజాశక్తిని ప్రజ్వలింపజేసి పరిపాలనాసూత్రముల ప్రజాయత్తమొనర్చుటకు నిశ్చయించిన విషయము రాష్ట్రీయులకు మోదావహము. ఈ యమూల్యసంకల్పమున కాచరణభాగ్యము కలిగించుటకు ప్రజా శ్రేయోభిలాషియగు మనప్రభుత్వము పరిపాలనా సంస్కరణముల పరిశీలించుట కొక విచారణసంఘ మేర్పరచదలచిన విషయము పాఠక లోకమునకు విదితము. ఇట్టి విచారణసంఘములో, భావికాలమునందు ప్రజాశ్రేయ ప్రభుత్వమేర్పడుటకు, ప్రభుత్వమువా రనధికారతత్వము (Non official Element) విరివిగా యేర్పరచియుంచు టత్యవసరము.

నేడు రాష్ట్రమునందంతట విచారణ సంఘసభ్యుల విషయమై ప్రబలుచున్న అలజడి విచారణీయాంశము. అనుకొనబడుచున్న సభ్యుల ప్రాతినిధ్య రహస్య మగోచరముగాగలదు. రాష్ట్రమునందు వయోజనసమ్మతి పద్ధతి కాచరణభాగ్యము బడయనందున యిది పార్లమెంటరీ సంఘమనుట కవకాశములేదు రాష్ట్రమందలి సామంతక పాలకవర్గమునకు తావొసగబడలేదు. వివిధ భావనా వర్గమునకు Various Schools of Thought స్థానము కలిగింపబడనందున ఈ విచారణసంఘము ప్రాతినిధ్యసంఘము —(Represntative Body) యని వ్యవహరించ వీలులేదు. ఇటిస్థితిలో ఈవిచారణసంఘము నేవర్గమున కంటగట్టవలయునో విశదమగుటలేదు.

పిల్లపుట్టకపూర్వమే పేరుపెట్ట వీలులేదనవచ్చును. సభ్యుల నామకరణముల వివరములు బయలుపడుటకుపూర్వము గర్భమునం దున్న దానివిషయమై ముచ్చటించు టసమంజస మనవచ్చును. కాని యించుక చల్లని హృదయముతో, సహృద్భావముతో భావిచిత్రము దిలకించ నిశ్చయించిన వారికిని కేవలము సాహసముగా దృగ్గోచరము కాజాలదనుట నిశ్చయము. విషయ నిర్ణయానంతరము మార్పసంభవ మగుటంజేసి మునుముందే తగురీతిగా నిర్ణయించుట ముఖ్యము.

నేడో రేపో రాష్ట్రమునందు శాసనసభా విస్తరణము కానున్నది. దానికి దేశమందలి ప్రతివ్యక్తికి తగుసౌకర్యము కలిగియుండు టత్యావశ్యకము "పూర్వపు, నేటి శాసనసభలందలి యభ్యర్థులలో భేదముగలదా? యను ప్రశ్నకు సిలోనుప్రభుత్వపు ముఖ్యమంత్రులగు సర్ బర్నార్డు బోర్డులీగారు ఇండియా ఫ్రాంచేజు కమేటీవారికొసగిన ప్రత్యుత్తరము గమనార్హము:

> "ప్రాచీన పద్ధతియందలి కన్న నేటి శాసనసభలయందు యునకు లధిక సంఖ్యలో గలరు ముఖ్యముగా కొలంబోయందు చాలా భేదము కలదు ప్రతి— స్థరి— కొలంలో ప్రజల—స్థానమునెందన్న కొనబడిన యొక కర్షకుడు గలడు. ప్రాచీన యెన్నిక పద్ధతి యందిది సంభవమని నిర్ణయించుటకు ముమ్మాటికి వీలులేదు"

కాబట్టి ప్రభుత్వమువారు ఆంధ్రమహాసభాధ్యక్షులు విశదపరచినటుల రైతు సుఖ దుఃఖములతో నేకముగానుండి, రైతుస్థితిగతు లవగాహనము చేసికొనిన ప్రజాసేవకులకు విచారణ సంఘము నందధికత్వము ప్రసాదింపజేసిన దేశాభ్యుదయమునకు మార్గదర్శిత్వమేగాక దేశీయుల యవసరములు పూర్తియగుటవలన ప్రభుత్వమునకు స్థిరత్వము, నిశ్చలత్వమేర్పడి గడించిన—సార్థవనామము సార్థకమగును.

## అసాధారణ నిర్బంధములు

ఈ సంచికలో స్థలాంతరమున మెదకుపట్టణమందు గణపతిఉత్సవమును గూర్చిన ఒకవార్త ప్రకటించ బడినది. ఇదియు, గతసంచికలో గణపతిఉత్సవము అను గూర్చి ప్రకటించ బడిన మదనాపురపువార్తయు, భువనగిరివార్తయు మన రాష్ట్రమిందు పైన నిర్దేశించబడినప్రాంతములలో సాధారణములైన ఉత్సవములను, సమావేశములను సాధారణముగా జరుపుకొన నిచ్చుటకు అనుకూలమయి కాని అసాధారణ పరిస్థితులేవో యున్నటుల ఇతరులకు అనుమానము కలిగింప జేయు నవిగనున్నవి.

మామూలుగా పోయిన మూడు నాలుగేండ్లనుండి సర్కారువారిచే కూడ అనుమతించ బడిన మదనాపురపు గణపతి ఉత్సవము ఈ ఏడు ఆపబడినది; భువనగిరిలో "బాల భజన మండలివారికి" గణపతి ఉత్సవము జరుపుకొనుటకుఅనుజ్ఞ చిక్కలేదు. భువన గిరిలో కృష్ణాష్టమి జరుపుకొనుటకు అనుమతి నిరాకరించబడినది. ఈ ఉత్సవములు ఆగుటకుగొప్ప కారణము లేవియు కనిపించవు. భువనగిరిలో గణపతిసేవ దీయదలచిన వారు ౧ అర్బాలోగా తహసీలులో దరఖాస్తు లివ్వవలయు నని దండోరా వేయించిన అధికారి "నూతన ఉత్సవము గాన తహసీలు కీవిషయమున అధికారములే" దనిరి; మరియు "జాబితా ప్రకారము నిగ్రాని యుంచవలసిన" దని పోలీసుముంతజం గారికి వ్రాయబడినది- అదే యూరిలో కృష్ణాజన్మాష్టమి సందర్భములో సేవదీయుటకు దరఖాస్తు ౧౦ రోజులకు పూర్వము దాఖలుచేయ బడవలసి యుండ అట్లు జరగనందున సేవకైఅనుజ్ఞ యొసగబడలేదు.

మెదకులో గణపతి ఉత్సవము తుదకు జరిగినను, మొదట వ్యవహారము సుఖముగా సాగలేదు. మామూలుగా ఉత్సవము జరుపు మందిరము శిధిలావస్థలో నున్న కారణమున శ్రీ పావన్న సేటగాణిగారి మందిరమున ఉత్సవములు జరుప నిశ్చయించి, చాలా రోజులు ముందుగానే, చోటు మార్పుకొరకును మామూలు ప్రకారము ఉత్సవముజరుపు కొనుటకును దరఖాస్తు పంపుకొన బడెను. స్థలము మార్పు విషయమున తమకు గాని, జిల్లాకుగాని ఏవిధమైన అధికారములేవనియు, ఉమూరె మజహబీకిమాత్రమే కలదనియు దరఖాస్తు త్రోసివేయబడెను. కనుక రెండవదరఖాస్తు పూర్వస్థలమందే ఉత్సవమును 3 అర్బా మొదలుకొని ౭ అర్బావరకు ౫ రోజులు జరుపుకొనుటకు అనుమతికై పంపబడెను. జిల్లా అధికారులనుండి ౪ రోజులకు అనుమతి లభించినది, అదియు అన్యవధి ౫. సరిగా ఉత్సవపుమూడురోజు సాయంత్రము అంద చేయబడెను. అంత మరుసటి రోజు ఉత్సవకార్యదర్శి సంగారెడ్డికి వెళ్లి తాలుకు్దారు గారిని ౫ న రోజు కూడ ప్రసాదించుటకై ప్రార్థించ వలసివచ్చెను దానిపై తాలూకాదారు గారు "ఏమియు అభ్యంతరము లేకన్న ఇంకొక రోజు హెచ్చించ వచ్చును" అని వ్రాసిరి తహసీల్దారుగారి ధర్మాన వారనుమతి యొసగుటచే ఉత్సవము నెమ్మదిగా జరిపోయెను

ఈ దరఖాస్తులపై దరఖాస్తులుస్టాంపు వెంట ఖర్చులు, ఈతిరుగు ళ్లఖర్చుస్టాంపులు, శ్రమలు ఇవన్నియు రాష్ట్రశాంతికి గాని ప్రజాశాంతికిగాని భంగముకలుగు నను అనుమానమే లేని సమయమునను ప్రదేశమునను, ఒకసారి ఉత్సవముజరిపినవానికి రెండవసారి ఆ విషయమును తలపెట్టుటకే నిరుత్సాహ వంతునిగ జేయును. ఉత్సవాదులలో నలుగురైదుగురికంటె మించి జనము ఒకచోట చేరుటవల్ల అల్లరి జరుగుటకును, ప్రజాశాంతికి భంగము కలుగుటకును, అవకాశము యేర్పడ వచ్చునను భయముతో సాధ్యసమైనంత ముందుగా జరుగబోవు ఉత్సవముల సంగతి తెలిసికొనగల్గినచో, ఉపద్రవము సంభవించు నని అనుమానమున్న చోట్లఉత్సవము లనాపుటకును, తక్కినచోట్ల ఉపద్రవముల కవకాశములేకుండ- అనుకూలముకొలది తగిన సంరక్షణ ఏర్పాట్లను చేయుటకును వీలుండునని ప్రభుత్వమువారి అభిప్రాయమైయుండును. ఉత్సవముజరుపుకొనుటకు అనుమతి సంపాదించుకొనగల్గు లోపల పడవలసిన వ్యయ ప్రయాసలకు భయపడి అనేకులు ఉత్సవములనేమానుకొనుటవలన శాంత్యుపద్రవములకుఅవకాశములు చాలా తగ్గగలవనునది నిజమే- కాని శాంత్యుపద్రవకారకు లెవరో వారలను జాగ్రత్తగాకనిపెట్టియుండి వారలను నిర్బంధములలో నుంచుట సాధారణ పరిస్థితులలో (అనగాయుద్ధము. గొప్పకొట్లాటలు లేనిసమయములలో) సరియైన మార్గమగునుగాని, దుష్టులకై నిర్దోషులుకూడ నిర్బంధములలోత్రోయబడుట ప్రశంసించదగిన విధానముకాదు. ఇపుడు పైనచెప్పబడిన సందర్భములలో ఉత్సవముల జరుపదలచిన వారలును జరిపినవారలును ఏదియోయొక దూర దురుద్దేశ్యమును సాధించుటకై వేసినవన్నెగడ లీయుత్సవములని అనుమానించుటకు అధారములే లేవు. అటువంటి సందర్భములలో వారలు ఎట్టిప్రమాదమునకును లోనుగాకుండ తమఉత్సవములను జరుపుకొనుటకువీలుండవలసినది.

సందర్భవశమున ఇంకొకవిషయము గమనించదగియున్నది. ఈఉత్సవముల గస్తీ, బహిరంగసభలగస్తీ మున్నగు గస్తీలవల్ల కొందరు కసిదీర్చుకొనుటకు తమకు గిట్టనివారలు జరుపదలచిన ఉత్సవములను సభలను జరుగనీయకుండజేసి సంతోషించుట కవకాశము ఏర్పడినది. ఈఖమ్మములో జరిగిన తృతీయాంధ్రమహాసభలో కొందరమాయాపరులు కక్షగట్టి సంఘసంస్కర్తలకు ప్రియములైన నిరపాయకరములైనకొన్నితీర్మానములను సభలో ప్రతిపాదించనీయకుండ చేయుటకు బహిరంగసభల గస్తీ శరణుజొచ్చిరి. నాగరకర్నూలులో జరిగిన మహబూబునగరుజిల్లా సంఘప్రథమ వార్షికోత్సవసందర్భమునందు వరవిక్రయ నాటకమాడకుండ చేయబడినదిటులే. షాపురములో ఇటీవల ఆయుర్వేద సంబంధమైన సభకు మొదట అటంకముకలిగినదియు ఇట్లేనని తెలియుచున్నది. ఇపుడు మదనాపురము గణపత్యుత్సవము ఆగినదియు ఇటువంటి కారణముచేతనేయని మాస్వకీయవిలేఖరి తెలిపినాడు ప్రభుత్వమువారిచే సదుద్దేశ్యముతో చేయబడిన నిర్బంధములను కట్టుబాట్లును ఇట్లు అసూయాపరులచే దుష్టమగు విధమున ఆక్షేపుల చర్యల కంటగట్టబడకుండ జూచుట ప్రభుత్వాధికారుల ధర్మము.

మొత్తముమీద ప్రభుత్వమువారు పౌరస్వాతంత్ర్యపు హక్కులకు భంగము కలిగించుచున్న బహిరంగసభల గస్తీ మున్నగువాటినిగూర్చి, ప్రత్యేకముగ నొక ఉపసంఘముచేనైనను ఆలోచింపజేసి నిర్దోషుల స్వాతంత్ర్యములకు ఆటంకము కలుగకుండదుష్టుల చర్యలుమాత్రము అటంకపరచబడునట్లు చేయుటకు మార్గములను నిర్ణయింప జేసి, తదనుకూలమగు విధానమును నిర్బంధములుగ చేయుటయుక్తము.

—

రాష్ట్రమునందు వివిధోద్దేశాదర్శములు గలిగి తత్సాఫల్యతకు కృషిసలుపుచున్న ప్రజాహితసంస్థలు గలవు. ప్రభుత్వమువారిట్టి నాయకులతో సంప్రదించి తదనుగుణ్యమగు సమర్థుల నిర్ణయించెదరని మా దృఢ విశ్వాసము.

—౦—

## ప్రజాక్షేమ పాలనమునకు ప్రభుత్వేతర ప్రాతినిధ్యమత్యవసరము

### ప్రజల స్థితిగతులతో, సుఖదుఃఖములతో నేకముగా నుండు ప్రజాసేవకులే ప్రాతినిధ్యము వహించుటకర్హులు

### రాష్ట్రపు సర్వతోముఖాభివృద్ధికి ఆంధ్రుల సంబంధ ముండుటచే విచారణ సంఘమునందు వీరికి సరియగు ప్రాతినిధ్యముండు టత్యావశ్యకము

నిజాం రాష్ట్రాంధ్ర మహాసభాధ్యక్షులు, శాసనసభ్యులు, ప్రజాసేవకులగు శ్రీ కొండా వేంకటరంగారెడ్డిగారి సదభిప్రాయము

ప్రభుత్వమువారు పరిపాలనా విషయములలో నూతన సంస్కరణములు ప్రవేశ పెట్టదలచి అయా విషయములం దాలోచించి ప్రభుత్వము వారికి తమ అమూల్యాభిప్రాయములతో నివేదించుటకు, ప్రభుత్వ, ప్రభుత్వేతర సభ్యులుగల విచారణ సంఘమొకటి నియమింపనున్నటుల స్థానిక, పరస్థానిక పత్రికలందు వార్తలు ప్రకటితములగుచున్నవి. ఇంతవరకీ ముఖ్య విషయము గురించి ప్రభుత్వమువారి ప్రకటన వెలువడకున్నను, విచారణసంఘమువారి కర్తవ్యము ప్రభుత్వము విశదపరచకున్నను, ప్రభుత్వమువారి ప్రకటనానంతరము మార్పుజరుగుటకు వీలుండకుండుటచే ప్రభుత్వమువారు రాష్ట్రమంతటికి లాభకరములగు పద్ధతులవలంబించు టత్యవసరమనువిషయముపై ప్రభుత్వమువారి దృష్టి కేంద్రీకరింపజేయుట నావిద్యుక్తధర్మమని గ్రహించుచున్నాను. ప్రజామోదము, ప్రజల స్థితిగతులతో పరిచయముగలిగి రైతుల సుఖదుఃఖములతో సంబంధమేర్పడియుండు ప్రభుత్వేతర సభ్యులమాత్రమే దీనియందు చేర్చబడుదురని విశ్వసించుచున్నాను.

ఈ సంఘమునందు మన మిత్రులగు శ్రీ కాశీనాధరావువైద్య అడ్వకేటుగారును, అక్బరలీ ఖాన్ బ్యారిష్టరుగారు ప్రభుత్వేతర సభ్యులుగానున్నటుల పత్రికలవలన తెలుసుకొని సంతసించుచున్నాను శ్రీ దివాన్ బహద్దురు అరవముదం అయ్యంగారి సంఘమున సభ్యులుగా నుండునటుల గలదు. కాని ప్రభుత్వేతర సభ్యుల యీసంఖ్య అత్యల్పముగా గలదు. ఇట్టి ముఖ్య సమస్యల ఆలోచించి సదభిప్రాయముతో ప్రభుత్వమున కందజేయుటకు ప్రభుత్వేతర సభ్యులసంఖ్య హెచ్చించు టత్యవసరము

ఈ రాష్ట్రమునందు ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటకమను మూడు ప్రాంతములుగలవు.ఆంధ్రప్రాంతము రాష్ట్రమునందు చాలాగొప్పది. రాష్ట్రపు సాంఘిక ఆర్థికాభివృద్ధితో ఆంధ్రులకు ఘనమగుసంబంధము గలదు. ఇట్టి ముఖ్య సమస్యల ఆలోచించి ప్రభుత్వమువారికి నివేదిక అందజేయుట కేర్పడనున్న సంఘమునందు ఆంధ్రుల ప్రాతినిధ్యము తప్పక గమనింపబడునని విశ్వసించుచున్నాను కర్ణాటకుల ప్రాతినిధ్యమిటులనే యత్యవసరముగా గలదు. ఈ సంఘమునందు ఆంధ్రకర్ణాటక ప్రాతినిధ్యములై ఆయావర్గముల సభ్యులు చేర్చబడకున్న "ప్రజాభిప్రాయమునకు తావొసగబడలేదనుట నిశ్చయము కాబట్టి ప్రభుత్వమువారు సంఘ నిర్మాణమునందీ విషయములు గమనింతురని నమ్ముచున్నాను.

—

## శాసన సభా సమావేశము

### శాసన సభా సవరణ చిత్తు శాసన చర్చ

[illegible]

(ప్రత్యేక విలేఖరి)

ఈనెల ౨౪వ తేదివాదు మన శాసనసభ ౧౩౪౬ఫ సాధారణ సమావేశము జరుపబడుటకు నిశ్చయింపబడినది ఇందు ఎన్నియో శాసనములందు సంస్కరణములను ప్రవేశపెట్టుటకు ఆలోచింపబడనున్నవి చర్చనీయ చిత్తు శాసనములలో ౧౩ ప్రభుత్వము పక్షమునను మిగతవి శాసనసభ్యులచేతను ప్రవేశ పెట్టబడినవున్నవి అనధికార సభ్యులచే ప్రవేశపెట్టబడెడి చిత్తు శాసనములలో ఎన్నుకొనబడిన సభ్యులలో నొకరగు శ్రీ కొండా వేంకటరంగారెడ్డి గారి (ఆంధ్ర మహాసభాధ్యక్షులు) పక్షమున అధికముగా గలవు

శాసనసభా కార్యదర్శులగు నవాబు హోసంయార్జంగు బహద్దురుగారిచే ప్రవేశ పెట్టబడనున్న హైకోర్టు శాసనసవరణ చిత్తు శాసనము చర్చింపబడి ఎట్టిఆక్షేపణలేకయే ఈ సమావేశమునందే అంగీకరింపబడునని తలపబడు చున్నది. చర్చనీయాంశముల పట్టికయందు వాణిజ్య పారిశ్రామికశాఖా కార్యదర్శులగు నవాబు రయీసుజంగు బహద్దరు గారిచే కంపెనీల శాసనము నందు సవరణ ప్రతిపాదింపబడనున్నది. ఈ చిత్తుశాసనము ౧౯౧౩ ఇండియన్ కంపెనీల ఆక్టు ననుసరించి సిద్ధపరుపబడినది. ఇది వాణిజ్యశాఖా పక్షమున ప్రవేశపెట్టబడుచున్నది కావున అవసర సంస్కరణల గావించు విషయము నాలోచించుటకు ఉపసంఘమువారి పరమొనర్చబడునని విశ్వసింప నగును

ఇతర చర్చనీయ చిత్తుశాసనములలో స్టాంపుశాసనమునందును, పురపాలక సంఘశాసనమునందు, సైనికదళమునందును సవరణలను గావించుటకు సంబంధించినవై యున్నవి. బారు కౌన్సిలు శాసనము, కార్మికుల ప్రతిఫల శాసనములుమనుగూడా ఆచరణలోనికి తెచ్చుటకు చిత్తుశాసనములు ప్రవేశపెట్టబడి ఆలోచింపబడనున్నవి ఇంతియగాక వివాహములకు సంబంధించిన చిత్తుశాసనముగూడా యీసమావేశమునందు ఆలోచింప బడనున్నది. ఇది కొంతకాలమునకు పూర్వము నగరమున మహబూబియా సినిమా దురంతరమునందు జరిగిన ప్రమాదమువలన ఇట్టివి ముందు జరుగకుండ అవసరవిధానముల నవలంబించు నుద్దేశ్యముతో ప్రభుత్వపక్షమున ప్రవేశ పెట్టబడుచున్నది ఈదురంతమునందు ౧౩ గురు మృత్యువాతపడినవిషయము పాఠకలోకమునకు విదితమే.

ఇపుడు ఆచరణయందుగల హైదరాబాదు కంపెనీల ఆక్టు ౧౯౧౨ ఇండియన్ కంపెనీల ఆక్టు ననుసరించి ౧౯౧౧ సం॥గమునందు ప్రవేశపెట్టబడెను భారతదేశమునందు కొంత రిపోర్టుల పరివర్తనను గమనించుచు ౧౯౧౩ సం॥రమునందు ఈశాసనమునందు అవసరసవరణలు గావింపబడెను. కాని సుమారు ౨౫ సం॥రములనుండియు హైదరాబాదు ప్రభుత్వమువారు తమ శాసనమునందెట్టి మార్పులను గలుగలేదు. పూర్వము వాణిజ్య, పారిశ్రామికశాఖా కార్యదర్శులుగా నుండిన బి.ఏ కాలిన్సుగారు వాణిజ్యశాఖయందు పునర్నిర్మాణము గావించుటకు కృషిసలిపి, కంపెనీల శాసనము, కార్మికుల ప్రతిఫలము శాసనము, ఫ్యాక్టరీలశాసనము మొదలగు వానియందు అవసరసవరణలను గావింప నున్నతాధికారులకు సూచనలొసగిరి

కోర్టుఫీక్కార చిత్తుశాసనము (తహతీర అదాలతు) యొక్క అవసరమునుగూర్చి కొంతకాలమునుండి న్యాయస్థానముల అధికారులు సూచనలను గావించుచుండుటచే హైకోర్టు రిజిష్ట్రారుగారి ప్రతిపాదనపై (౧౩౪౬ సం॥రమునందు) ఈవిషయమున హోమ్ పార్లమెంటువారొక చిత్తుశాసనమును ప్రవేశపెట్టియున్నారు. ఈశాసనము ౧౮౭౦ సం॥ర భారత కోర్టుఫీక్కార శాసనమునట్టి ప్రవేశ పెట్టబడుచున్నది

సైనిక దళశాసనమునందు సవరణలను గావించుటకై సైనికశాఖా కార్యదర్శులగు నవాబు సవదు యార్జంగు బహద్దురు చిత్తుసవరణ శాసనమును ప్రవేశ పెట్టియున్నారు.

మౌల్వీ అబ్దుల్లాహిసాహెబ్ చే ప్రవేశపెట్టబడిన కార్మికుల ప్రతిఫలము చిత్తుశాసనము, సేటు పన్నాలాల్ గారిచే ప్రవేశపెట్టబడిన ఆస్తి అన్యాక్రాంత చిత్తుశాసనము (ఖానూనె యింతఖాలె జాయదాదు)విశేషము చర్చింపబడవచ్చుననియు, [illegible] ర్పబడవచ్చునని తలపబడుచున్నది.

శ్రీ కాశీనాధరావు వైద్యగారిచే (నిరోజీ కసభ్యుడు) ౧౯౦౦ సం॥ర శాసనసభాశాసనమునందు సవరణల గావించుటకు ప్రవేశపెట్టబడిన చిత్తుశాసనమును ప్రవేశపెట్టుటకు ప్రభుత్వమువా రనుమతించ లేదని తెలియుచున్నది

—

# H. E. H. The Nizam's State Railway.

## మహా ఘనత వహించిన నిజాం సంస్థానపు రైల్వే

# నోటీసు

1937 ఒకటవ అక్టోబరు మొదలు ప్యాసింజర్ రైలు రాకపోకలను తెలుపు పట్టి

## పెద్దలైను [బ్రాడుగేజి]

| | | 2 ప్యాసింజరు | 14 ప్యాసింజరు | 22 మిక్సుడు | 4 ప్యాసింజరు | 102 పటిల్ | 12 ప్యాసింజరు | 10 ప్యాసింజరు |
|---|---|---|---|---|---|---|---|---|
| | | గం. ని. | గం.ని. | గం.ని. | గం.ని. | గం.ని. | గం.ని. | గం.ని. |
| వాడి | పోక. | 3-20 | | | 11-32 | | | |
| | | | | బీదరు నుండి | | | | పర్లి నుండి |
| వికారాబాదు | రాక. | 6-10 | | 10-5[illegible] | 13-53 | | | 18-19 |
| | పోక. | 6-18 | | 11-20 | 14-03 | | | 18-29 |
| బేగంపేట | పోక. | 7-40 | | 13-14 | 15-18 | | | 19-51 |
| హైదరాబాదు బి. జి. | రాక. | 7-52 | | 13-29 | 15-29 | | | 20_01 |
| | పోక. | 8-09 | 11 05 | 14-08 | 15-45 | 17-43 | 19-04 | 20_09 |
| శికింద్రాబాదు | రాక. | 8-26 | 11_2[illegible] | 14-40 | 16-06 | 18-03 | 19-25 | 20_30 |
| | పోక. | 8-46 | 11_36 | | | 18-09 | 19-45 | |
| భోనగిరి | పోక. | 9-51 | 12_37 | | | 19-35 | 20-38 | |
| | | | | | | రాక | | |
| కాజీపేట | రాక. | 11_56 | 14-32 | | | | 22-32 | |
| | | | | | | 8 మిక్సుడు | 6 గ్రా. ట్రం. ఎక్స్‌ప్రెస్ | |
| బల్లార్షా | రాక. | | | | | 12-05 | 21-06 | |
| | | | | | | వార్ధా నుండి | ఢిల్లీ నుండి | |
| | పోక. | | | | | 12-45 | 21-30 | |
| కాజీపేట | రాక. | | | | | 20_20 | 2-49 | |
| | పోక. | 12_11 | | | | 23_10 | 3-17 | |
| వరంగల్ | పోక. | 12-22 | | | | 23-27 | 3-28 | |
| డోర్నకల్ జంక్షన్ | రాక. | 14-18 | | | | 2_26 | 5-00 | |
| | పోక. | 14-28 | | | | 6-40 | 5-15 | |
| బెజవాడ | రాక. | 17-05 | | | | 10-25 | 7-50 | |
| | | | | | | | మద్రాసుకు | |
| | పోక. | | | | | | 8-10 | |

| | | 1 ప్యాసిం. | | 5 గ్రా. ట్రం. ఎక్స్‌ప్రెస్ | 7 మిక్స్‌డ్ | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. |
| బెజవాడ | రాక. | | | 17-10 | | | | |
| | | | | మద్రాసునుండి | | | | |
| | పోక. | 5-40 | | 17-30 | 19-10 | | | |
| డోర్నకల్ జంక్షన్ | రాక. | 8-44 | | 20-03 | 22-58 | | | |
| | పోక | 8-59 | | 20-23 | 23-28 | | | |
| వరంగల్ | పోక. | 10 53 | | 22-06 | 2-06 | | | |
| కాజీపేట | రాక. | 11-11 | | 22-25 | 2_30 | | | |
| | పోక | | | 22-53 | 6_25 | | | |
| బల్లార్షా | రాక. | | | 4-15 | 13-47 | | | |
| | | | | ఢిల్లీకి | వార్ధాకు | | | |
| | పోక. | | | 4-40 | 14-22 | | | |
| | | | 13 ప్యాసిం. | 11 ప్యాసిం. | | 101 పటిల్ | | |
| కాజీపేట | రాక. | | | | | | | |
| | పోక. | 11-23 | 16-47 | 3_25 | | | | |
| భోనగిరి | పోక. | 13-51 | 18-52 | 5-30 | | 7-25 | | |
| | | | | | 9 ప్యాసిం. | | 3 ప్యాసిం. | 21 మిక్స్‌డ్ |
| శికింద్రాబాదు | రాక. | 15-00 | 20 14 | 6-26 | | 8-40 | | |
| | పోక. | 15-20/ 17-20 | 20-34 | 6-41 | 7_20 | 8_50 | 9-20 | 13_15 |
| హైదరాబాదు బి.జి. | రా. | 15-41/ 17-40 | 20-54 | 7-01 | 7_41 | 9-08 | 9-40 | 13-42 |
| | పోక. | . / 17-55 | | | 7-56 | | 9-48 | 13-50 |
| బేగంపేట | ,, | 18-06 | | | 8-8 | | 9-57 | 14-07 |
| వికారాబాదు | రాక | 19-32 | | | 9-23 | | 11-14 | 16-38 |
| | పోక | 19-42 | | | 9-31 | | 11-26 | 16_55 |
| | | | | | పర్లీకు | | | బీదర్‌కు |
| వాడి | రాక. | 22-10 | | | | | 14-05 | |

### వికారాబాదు - పర్లి - వైద్యనాథ్ సెక్షన్

| | | 9 ప్యాసింజరు | 21 మిక్స్‌డ్ | | | 10 మిక్సుడు | 22 మిక్సుడు |
|---|---|---|---|---|---|---|---|
| | | గం.ని. | గం.ని. | | | గం.ని. | గం.ని. |
| | | శికింద్రాబాద్ నుండి | | పర్లి వైద్యనాథ్ | పోక. | 7-30 | |
| వికారాబాదు | రాక. | 9-23 | 16-38 | మహమ్మదా బాదు బీదరు | రాక. | 15-39 | |
| | పోక. | 9-31 | 16-55 | | | ప్యాసిం | |
| మహమ్మదా బాదు, బీదరు | రాక. | 11-50 | 20-48 | | పోక. | 16-00 | 7-05 |
| | | మిక్స్‌డ్ | | వికారాబాదు | రాక. | 18-19 | 10-52 |
| | పోక. | 12-10 | | | పోక. | 18_29 | 11-20 |
| పర్లివైద్యనాథ్ | రాక. | 19-40 | | | | శికింద్రాబాదుకు | |

### డోర్నకల్ జంక్షన్ — సింగరేణికాలరీసు సెక్షన్

| | | 18 మిక్సుడు | 20 మిక్సుడు | | | 17 మిక్సుడు | 19 మిక్సుడు |
|---|---|---|---|---|---|---|---|
| | | గం.ని. | గం.ని. | | | గం.ని. | గం.ని. |
| డోర్నకల్ | పోక | 9_37 | 15_15 | సింగరేణికాలరీస్ | పోక. | 12-35 | 18_35 |
| సింగరేణికాలరీసు | రాక. | 11-00 | 16-42 | డోర్నకల్ జంక్షన్ | రాక. | 13-50 | 19_55 |

### డోర్నకల్ జంక్షన్ — భద్రాచలంరోడు సెక్షన్

| | | 16 మిక్సుడు | | | 15 మిక్సుడు |
|---|---|---|---|---|---|
| | | గం. ని. | | | గం.ని. |
| డోర్నకల్ జంక్షన్ | పోక. | 9-00 | భద్రాచలంరోడ్డు | పోక. | 12-11 |
| భద్రాచలంరోడ్డు | రాక. | 11-08 | డోర్నకల్ జంక్షన్ | రాక. | 14_18 |

## చిన్నలైను [మీటర్ గేజి]

| | | 39 పటిల్ | 35 ప్యాసింజరు | | | 41 పటిల్ |
|---|---|---|---|---|---|---|
| | | గం.ని. | గం.ని. | గం.ని. | గం.ని | గం.ని. |
| ద్రోణాచలం | పోక. | 6-25 | 10-30 | | | 15-40 |
| కర్నూలు టవున్ | రాక, | 7-38 | 11-36 | | | 16-52 |
| | పోక, | | 11-48 | | | |
| | | 37 ప్యాసిం | | | | |
| మహబూబ్ నగర్ | రాక. | | 15-16 | | | |
| | పోక. | 7-27 | 15-26 | 34 ప్యాసిం | 30 ప్యాసిం | 32 ప్యాసిం |
| హైదరాబాదు ఎం. జి. | రాక. | 10_26 | 18-18 | | | |
| | పోక. | 10-29 | 18-28 | 6_50 | 16-50 | 19-15 |
| శికింద్రాబాదు | రాక | 10-52 | 18-50 | 7-20 | 17-07 | 19-40 |
| | పోక. | | | 7_33 | 17_18 | 20-00 |
| నిజామాబాదు | రాక. | | 48 పటిల్ | 12-00 | 22_08 | 23-47 |
| | పోక. | | | 12-10 | | 23-57 |
| నాందేడు | ,, | | 12-10 | 15-15 | | 2-38 |
| పూర్ణా | రాక. | 44 పటిల్ | 18_47 | 15-57 | | 3-20 |
| | | | మిక్స్‌డు | | | |
| | పోక. | 20-30 | 14-30 | 16-07 | | 3-30 |
| పర్భని | రాక. | 21_32 | 15-41 | 16-44 | | 4-11 |
| | పోక. | 22-12 | 15-58 | 16-52 | | 4-19 |
| జాల్నా | రాక. | పర్లీకు | పర్లీకు | 20-04 | | 7-19 |
| | పోక. | | | 20-24 | | 7-33 |
| ఔరంగాబాద్ | ,, | | | 22-05 | | 9-21 |
| మన్మాడ్ | రాక | | | 1-02 | | 21-26 |

| | | 33 ప్యాసిం. | 31 ప్యాసిం. | | | |
|---|---|---|---|---|---|---|
| | | గం.ని. | గం.ని. | గం.ని. | గం.ని. | గం.ని. |
| మన్మాడ్ | పోక. | 4-05 | 13_50 | | | |
| ఔరంగాబాదు | ,, | 6-47 | 16-43 | | 43 పటిల్ | 47 మిక్స్‌డ్ |
| జాల్నా | రాక. | 8-34 | 18-30 | | | |
| | పోక. | 8_48 | 19_00 | | పర్లినుండి | పర్లినుండి |
| పర్భని | రాక. | 11_32 | 21-54 | | 4-00 | 8-55 |
| | పోక. | 11_35 | 21-57 | | 4-42 | 9_15 |
| పూర్ణా | రాక. | 12-08 | 22-38 | | 5-45 | 10-30 |
| | | | | | | పటిల్ |
| | పోక. | 12-22 | 22-52 | | | 10-55 |
| నాందేడ్ | ,, | 12-58 | 23-35 | | | 12-00 |
| | | | | 29 ప్యాసిం. | | రాక |
| నిజామాబాద్ | రాక. | 15_54 | 2_24 | | | |
| | పోక. | 16_04 | 2-34 | 4-30 | 36 ప్యాసిం. | 38 ప్యాసిం. |
| శికింద్రాబాదు | రాక. | 20-41 | 6-50 | 9-38 | | |
| | పోక. | 20-53 | 7-17 | 9-48 | 7-00 | 17_33 |
| హైదరాబాదు ఎం. జి. | రాక. | 21-10 | 7-34 | 10-04 | 7-14 | 17_48 |
| | పోక. | | | | 7-24 | 17-53 |
| మహబూబునగరం | రాక. | | | | 10-10 | 20-36 |
| | పోక. | | | | 10-18 | |
| | | 40 పటిల్ | | | | 42 మిక్స్‌డ్ |
| కర్నూలు టౌన్ | రాక | | | | 13-44 | |
| | పోక. | 8-30 | | | 13-56 | 17-32 |
| ద్రోణాచలం | రాక. | 9-50 | | | 15-10 | 20-00 |

### పూర్ణా—హింగోలి సెక్షన్

| | | 45 మిక్సుడు | | | 46 మిక్సుడు |
|---|---|---|---|---|---|
| | | గం.ని. | | | గం. ని. |
| పూర్ణా | పోక. | 7-10 | హింగోలి | పోక. | 12-30 |
| హింగోలి | రాక. | 10-40 | పూర్ణా | రాక. | 15-45 |

### పర్భని - పర్లి - వైద్యనాద్ సెక్షన్

| | | 44 పటిల్ | 48 మిక్సుడు | | | 43 పటిల్ | 47 మిక్సుడు |
|---|---|---|---|---|---|---|---|
| | | గం.ని. | గం.ని. | | | గం.ని. | గం.ని. |
| | | పూర్ణా నుండి | నాందేడు నుండి | పర్లి-వైద్యనాద్ | పోక. | 1.32 | 6-00 |
| | | | | పర్భని | రాక. | 4.00 | 8-55 |
| పర్భని | రాక. | 21-32 | 15-41 | | పోక. | 4-42 | 9-15 |
| | పోక. | 22-12 | 15-58 | | | పూర్ణాకు | నాందేడ్‌కు |
| పర్లి-వైద్యనాద్ | రాక | 0-40 | 19_00 | | | | |

శికింద్రాబాదు,
25వ ఆగస్టు 1937.

ఏ. డబ్ల్యు. వాట్స్.
చీఫ్ టాను ... పరింటెండెంట్.

The only Leading National Bi-weekly of the whole Andhra Desa

GOLKONDA PATRIKA is The best medium for all traders and dealers

Advertise at once

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA PATRIKA is The only popular voice of 7,000,000 Andhras of THE NIZAM'S DOMINIONS

Volume 12 | HYDERABAD - DECCAN | Number 38

MoNday 20 September 1937

## హై. పొలిటికల్ కాన్ఫరెన్సు

న్యాయమూర్తులగు రామచంద్రనాయకుగారు హైదరాబాద పొలిటికల్ కాన్ఫరెన్సు స్టాండింగు కమిటీ సభ్యత్వమును వదలుకొనిరి

## బరారు యువరాజ దంపతుల గౌరవార్థము విందు

ప్రభువుగారు దయచేయుట

౧౩ అబాన్ సాయంకాలము ౪౹ గంటలకు మొఅజ్జంజాః దంపతులు బరారు యువరాజ దంపతులకు విందొసగిరి. ప్రదర్శన సౌధము (పోలోపోలు కెదురుగానుండునది) చక్కగా అలంకరింపబడి యుండెను. సుమారు వేయిమంది అతిథులుండిరి.

మొఅజ్జంజాః బహద్దురు దంపతులు ౪–౨౫ గంటలకు దయచేసిరి గార్డు ఆఫ్ ఆనరుతో గౌరవింపబడిరి. ౪–౪౦ గంటలకు బరారు యువరాజా దంపతులు దయచేయ మొఅజ్జంజాః దంపతులు స్వాగత మొసర్చిరి.

౪–౫౦ గంటలకు ప్రభువుగారు రాకుమారులతో దయచేసిరి. గార్డు ఆఫ్ ఆనర్‌తో గౌరవింపబడిరి. అతిథులందరు వందనము లొనర్చిరి ప్రత్యేకముగా విర్పరుపబడిన సింహాసనమునందు ప్రభువుగారాసీనులైరి అనరబుల్ సి. హెచ్ గిడ్నీ ఖాన్సుకానాగారితో విజయము చేసిరి.

ప్రభుత్వ సభసభ్యులు, మంత్రులు, అధికారులు, న్యాయమూర్తులు, కార్యదర్శులు, హైదరాబాద, సికింద్రాబాద సైనికోద్యోగులు మొదలగువారందరు సుమారు ౧౦౦౦ మంది అతిథులు విందులో పాల్గొనిరి తేనీ పానీయములతో అతిథులు సత్కరింపబడిరి

౬–౫౦కి ప్రభువుగారు సౌధమునకు వెళ్లినం అటుతర్వాత యువరాజ దంపతులు, మొఅజ్జంజాః దంపతులు అతిథులందరు వెళ్లిపోయిరి

## నోటీసు.

వైశ్యకులాచార ధర్మములలో పునర్వివాహము వొప్పుకోబడి నిరాటంకముగా నెరవేరుచున్నదియు మరియు ఆకులనాయకులు యిట్టి ఆచారము లోకమంతట ప్రబలి కులసోదరులకు మేలుకూర్ప వలయునని కంకణముకట్టుక భారము వహించి యెన్ని యో కార్యములు నెరవేర్చి ముందుయింకా నెరవేర్పనున్నదియు లోకప్రసిద్ధమే. యిట్లుండ మా జనగామ వైశ్య సంఘము లోకొందరు అనగా రా॥ పబ్బాసిద్దలింగంగారు రా॥ జడిగెం వీరయ్య రామయ్య లక్ష్మయ్యగారి లింగయ్యగార్లు మూశెట్టిగౌరమ్మగారు రా॥ నేరెళ్ల కృష్ణమూర్తిగారు రా॥ కా కోటిరామయ్యగారు రా॥ నోముల లక్ష్మినారాయణగారలు మాత్రమేనా కొమారుడగు పట్టూరుపుల్లయ్యకు పునర్వివాహము చేసినాననే నెపముచే వైశ్య సంఘము నుంచి వేరుచూడ వలయుననే అభిప్రాయముతో యేమేమో అంతరంగ ఆలోచనలు నాకువమ్ముకలిగించెను చ్చటలు కొందరితో రహస్యంగ చెప్పుచున్నట్లు వినవచ్చెను. కాని రహస్యసంగతులకు సాక్షిభూతము లభించక తగుచర్య గొనటకు వీలుపడదాయెను. పై పేర్కొనిన కులసోదరులకు యీనోటీసు ద్వార తెల్యచేయుట మేమనగా నేను చేస్ని కార్యము అశాస్త్రీయమని నిషేధించ దలచినచో ఒక బహిరంగ సభ యేర్పరచి కులనాయకులరప్పించి వారిని మెప్పించి నన్ను బహిష్కరించ వచ్చును. లేదా యట్టికార్యము కులమునకు మేలు కూర్చునని కుల సిద్ధాంతము వప్పి యీగ్రామ సంఘముతోపాటు పై పేర్కొనిన వారున్ను యేకీభవించి, కుల గౌరవ ప్రయోజనాములతో నన్ను ఆక్షేపించకుండ చేర్చుకొంటు అంతరంగ ఆలోచనలు మానవలెను ఇట్లు చెయ్యక నావిషయమై, వమ్ముకలిగించె ముచ్చట్లు యువ్వరితో చెప్పినను చెప్పినవారిపై తగుఫవుజుదారి చర్య తీసుకోబడును ఫక్తు—

ఇట్లు
దః పట్టూరు శెంకరయ్య గుప్త.

## విఘ్నేశ్వరుని యుత్సవమునకు విఘ్నములు

ఇల్లు మార్చుటకు అంగీకారము అవసరమా?

(స్వకీయ విలేఖరి)

మెదక ౯ అబాన్

స్థానిక గణపతి యుత్సవము జరుపు మందిరము శిథిలావస్థయందున్న కారణమున శ్రీ పాపన్నపేట రాణీగారి మందిరమున యుత్సవము జరుప నిశ్చయించి, చాలా రోజులు ముందుగానే, చోటు మార్పు కొరకును, మామూలు ప్రకారము యుత్సవము జరుపుకొనుటకును, ప్రభుత్వమునకు దరఖాస్తు పెట్టుకొన తహసీలు దారుగారు క్రొత్త ప్రదేశమును స్వయముగా వీక్షించి, ఆప్రదేశమున యుత్సవములు జరుపుటకెట్టి యాక్షేపణ యుండదనియు, తగినంత సహాయముచేసి ఆజ్ఞ యిప్పింతుమనియు శెలవిచ్చిరి కాని యొసగబడిన దరఖాస్తుపై స్థలము మార్పు విషయమున తమకుగాని, జిల్లాకుగాని ఏవిధమైన యధికారములు లేవనియు, ఉమూరిమజహబు మాత్రమే కలదనియు వ్రాసి దరఖాస్తును త్రోసివేసిరి

మామూలుచోట ౩౦అబాన్ మొదలు ౭అబాను వరకు ౧౦రోజులు యుత్సవము జరుపుకొనుటకు మరల దరఖాస్తుయివ్వగా తహసీలునుండి హుకుంవచ్చిం దేవనంటే "మీరు ౧౦ రోజుల కొరకు ఆయుత్సవములు జరుపుటకు ఆజ్ఞ కోరియుంటిరి కాని జిల్లా అధికారులు ౪ రోజులు మాత్రమే యుత్సవము జరుపుట కిందుమూలమున అజ్ఞయిచ్చుచున్నారు కాని ఆజ్ఞాపత్రము సరిగా పండగరోజు (యుత్సవము) సాయంత్రము యీయ బడినది ఇంత అవ్యవధిగా ఆజ్ఞాపత్రము చేరినందున నాటి రాత్రియే కార్యవర్గ సమావేశము జరుపబడి, రెండవ రోజు జిల్లాకు (సంగారెడ్డికి) వెళ్లి యిరువది రోజుల వరకు యుత్సవము జరుపుటకు అజ్ఞ కోరవలయునని యు, ఇట్టి ఆజ్ఞ ప్రసాదింపబడు వరకు గణపతి మూర్తిని విసర్జన చేయక అట్లే యుంచుటకు తీర్మానింపబడినది. మరువాడు సెక్రెటరిగారు సంగారెడ్డికివెళ్లి తాలుక్దారుగారి దగ్గర మొర బెట్టుకోగా వారు మరల తహశీలుకు 'ఏమియు ఆటంకములు లేకుండినచో ఇంకొక రోజు హెచ్చించవచ్చును" అని వ్రాసి కార్యదర్శికిచ్చారు మరల కార్యదర్శి వెదకుచు వచ్చి తహశీలుదారుసా॥ గారికి దర్పించి ఆజ్ఞాపత్రము చూపింపగా వారు మరల క్రొత్త ఆజ్ఞాపత్రము జారీ చేసినందున తుదకు ఉత్సవము జరిగింది,

ఇక్కడ సంగీతము నేర్పుచున్న మహిళామణియు శ్రీ సత్యవతిగారి గాన సభ యుత్సవ సందర్భమున జరిగినది

## ఆరవ ఆంధ్రమహాసభ (నిజామాబాద)

(ప్రత్యేక విలేఖరి)

ఆరవ ఆంధ్రమహాసభా ఏర్పాట్లగురించి, ఆహ్వానసంఘ కార్యనిర్వాహక సభ్యులు విమగ్నులైయున్నారు ఆహ్వానసంఘము పైపున ఏర్పడిన ఉపసంఘసభ్యులు, తమతమ తాలూకాలలో పర్యటనముసలుపుచు, విరాళముల ప్రోగుచేయుటలో శక్తివంచనలేకుండ ప్రయత్నములు సలుపుచున్నారు ప్రధాన కార్యదర్శియగు, శ్రీయుత బి. కేశవరావుగారు, ఈశెలవులలో (౨౬–౧౨–౪౬) నుండి, జిల్లాలోని తాలూకా స్థలములకు వెళ్లి ఉపసంఘసభ్యులతో సంప్రతించి, మహాసభా సన్నాహములకు సక్రమముగాపనిచేయించుటకు ఏర్పాటు చేయనున్నారని తెలిసినది ఇంతవరకు కామారెడ్డి తాలూకాలో (౨౦౦౦) రెండు వేల విరాళములు వాగ్దానమై, కొంతపైకము వసూలు చేసినారు

ఆరవ ఆంధ్రమహిళా మహాసభ ఆహ్వానసంఘము ఈనెల ౯వ తేది (౯–౧౨–౪౬) న నిజామాబాద పట్టణమందేర్పడినది. శ్రీమతి బి సత్యవతీదేవి కామారెడ్డి గారు ఆహ్వానసంఘపు అధ్యక్షురాలుగాను, శ్రీమతి ఇ, జయలక్ష్మిదేవి గారు కార్యదర్శిగను, శ్రీమతి వి. సావిత్రీదేవి గారు సహాయకార్యదర్శిగను, అన్నపూర్ణాదేవిగారు కోశాధ్యక్షురాలిగను, ఇంక (౯) గురు సభ్యులు ఎన్నుకొనబడినారు. ఆహ్వానసంఘము రుసుము (౧—౦—౦) నియమించుకున్నారు. వీరు మహిళా మహాసభాహ్వానలేఖను మహిళామహాసభా స్థాయిసంఘమువారికిపంపి, అంగీకారము నిరీక్షించుచు, మహిళా మహాసభాధ్యక్షురాలిని ఎన్నుకొని తెలుప కోరినారు

## స్త్రీలు ఎఱుగుదురు

"మొన్నటికి ముఖమంతా పాలిపోయి చాలరోజులనించి యింతలో యింత ఆరోగ్యం! అది యెలా సాధ్యం?"
"అదే చెప్పుకోండి!"
"ఇదివరకు నే చెప్పినమందా?"
"కాదు"—
"ఏదైనా ఇంగ్లీషుమందా?"
"కా—దు"
"యూనానీయా?"
"కా———దు"
"మరి—?"

"లోధ్ర. పొరిగింటావిడ యిచ్చింది పుచ్చుకున్నాను నాలుగు మోతాదులు దాన్తోకడుపునొప్పి మట్టుకట్టు అదంతా మాయమైపోయింది"











Printed and P[ublished by] Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad, Editor K Balakrishna Reddy